# 10. కైలాసగౌరి నోము

**కథ :-** అన్ని విధాలా ధర్మాత్ముడయిన ఒక మహారాజు - ఏ కారణంవల్లనో వేశ్యల సాంగత్యంలో పడి, సుందరాంగీ - సౌశీల్యవతీయైన భార్యను ఉపేక్షించ సాగాడు. అందర్నీ ఆదరించే ఆ మహాపురుషుడి అనురాగం తనకు కాకుండా పోయినందుకా రాణీ యెంతగానో దుఃఖించేది. ఒనాడు పార్వతీదేవి ఆమె కలలో కనబడి "గతంలో నువ్వొకసారి కైలాసగౌరి నోము పట్టి ఉల్లంఘించడమే, యీ కష్టానికి హేతువు. మళ్ళీ ఆ నోము పట్టి భక్తి శ్రద్ధలతో ఉద్యాపన చేసుకొంటే, నీ భర్త సానిసంపర్కాన్ని మానివేస్తాడు. తిరిగి నీ యింటికే వస్తాడు. నీ సంసారం మూడుపువ్వులుగా ఆరుకాయలుగా వర్ధిల్లుతుంది". అని ఆదేశించించింది. మేల్కొంచిన తరువాత రాణీ - స్వప్నాన్ని గుర్తు చేసుకొని నోము పట్టి, ఉద్యాపన చేసుకోగా, అనతికాలంలోనే ఆమె భర్త వేశ్యా సంపర్కాన్ని వదిలి - రాణీ పట్ల అనురాగంతో ప్రవర్తించి, దేశమంతటా మరింత గొప్ప రాజుగా కీర్తి పొందాడు.

**విధానం :-** రోజూ ఉదయమే కథ చెప్పుకొని అక్షతలు వేసుకోవాలి. 6 నెలలు గడిచాక ఉద్యాపన చేసుకోవాలి.

**ఉద్యాపన :-** **7వ నెలలో వచ్చే పర్వ - పండుగదినాలలో పార్వతీ ఆలయంలో గాని, పరిశుభ్రమైన జీవనదీతీరంలో గాని - 5 కుంచాల కుంకుమా - 5 కుంచాల పసుపు - తగినన్ని పండ్లూ, తమలపాకులూ, పోకచెక్కలూ పెట్టుకొని ఒక్కొక్క ముత్తయిదువకూ 1 చారెడు కుంకుమ, 1 చారెడు పసుపు. 1 పండు, 1 తాంబూలం (5 తమలపాకులూ + 2 పోకచెక్కలూ - 1 తాంబూలం) చొప్పున, తెచ్చిన పసుపు కుంకాలయిపోయేవరకూ పంచిపెట్టుకోవాలి.**